# మల్లిపదాలు



మసన చెన్నప్ప

ప్రచురణ :

ప్రమిలా ప్రచురణలు

12-11-1095, రాఘవేంద్రనగర్,

సికింద్రాబాదు-500361.

MALLI PADALU
by :
MASANA CHENNAPPA

ప్రచురణ నెం : 1

ప్రథమ ముద్రణ :
ఎప్రిల్ 1980
ప్రతులు : 1000

వెల రూ. 2-50

ముద్రణ :
మనసా ప్రింటర్స్
హిమాయత్‌నగర్,
హైదరాబాదు.

ప్రతులకు
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
సికింద్రాబాదు—మద్రాసు

# వినతి

ఏ దేశ సాహిత్యమైనా మార్గదేశి భేదాలతో రెండు పాయలుగా సాగుతుంది. తెలుగులో నన్నయాదులు 'మార్గ'కు రూపురేఖలు దిద్దగా పాల్కుర్కి సోమనాథాదులు దేశికి నిషాణ లెత్తిరి. పద్యం కంటె పదం ముందుద్భవించిందని పండితులే నుడివిరి.

కూనలమ్మ పదాలు దేశి సాహిత్యమునకు చెందినవి. మరుగు పడిన కూనలమ్మ పదాలకు పునర్జన్మ కల్గించిన ఆధునిక కవి ఆరుద్ర. మాత్రా ఛందస్సులో వ్రాయబడిన ఈ పదాలు పాఠకులను మెప్పించ జాలినవి. ఈ ఉద్దేశ్యంతోనే కూనలమ్మ ఛందస్సులో 'పదాలు' వ్రాయ టానికి పూనుకొన్నాను. మల్లిని మకుటస్థానంలో నిల్పి ఆత్మావిష్కరణకు ఆలంబనంగా చేసికొన్నాను. నేనీ పదాలు 1975 నుంచి వ్రాస్తూవచ్చాను. హృదయం కదిలి అనుభూతి ఆవేశంగామారి అక్షరాకృతి ధరించగా ఏర్పడినవే ఈ "పదాలు" సులభమైన శైలిలో అర్థమయ్యే భాషలో చెప్పదలచిన భావాన్ని సూటిగా పాఠకులకు అందివ్వాలన్న ఆశయమే నేనీ పదాలువ్రాయటానికి హేతువు. కవి కేవలం తనకోసం కవిత్వం వ్రాసుకోడు. ప్రజలకోసం వ్రాసినప్పుడే దానికి సార్థక్యము.

నా అనుభవాలను నా కొద్ది పరిజ్ఞానంతో "మల్లిపదాల" రూపంలో వెల్వరించాను. వీని విలువను గుర్తించవలసినవారు సహృదయులే.

వృద్ధాప్యంలోనూ సాహిత్య పఠనమూ, రచనా వ్యాసంగమూ సాగిస్తూ, నాకు సాహిత్యశాస్త్ర ప్రపంచంతో పరిచయం కల్గించి నాచేత "తాతయ్యా" అని పిలిపించుకొన్న కీర్తిశేషులు శ్రీ గుండేరావు హర్కారే గార్కి ఈ "మల్లిపదాలు" అంకితం చేస్తున్నాను.

నాకు కవిజన్మను ప్రసాదించిన నా తల్లిదండ్రులకు, నమో వాకములు.

నా పదాలను ప్రచురిస్తే బాగుంటుందని సూచించిన డా॥ కె.కె. రంగనాథాచార్యులు, శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులు గార్లకు, నా కృతిని ఆమూలాగ్రం పరిశీలించి తగు సూచన లొసగి వెలుగులోనికి తెచ్చిన మద్గురువర్యులు సహృదయులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి, కోరినవెంటనే అధిక వాత్సల్యంతో, అకళంక హృదయంతో ఆశీస్సు లందించి ఆమోదం తెలిపిన మదాచార్యవర్యులు డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ కే. గోపాలకృష్ణారావు గార్లకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

నా పుస్తక ప్రచురణకు ఆర్థికసహాయమందించి తోడ్పడిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి నా కృతజ్ఞతలు.

నా కృతికి అక్షరాలంకరణచేసిన శ్రీ శీలా వీర్రాజు గారికి, అందంగా అచ్చువేసి అందించిన మనసా ప్రింటర్స్ వారికి నా కృతజ్ఞతలు.

6–4–1980
సికింద్రాబాదు

ఇట్లు
వంపన చెన్నప్ప



Dr. C. NARAYANA REDDY
Professor-Telugu Department
Osmania University

# ఆశీస్సు

కూనలమ్మ పదం జానపదగేయ పేటికలో దొరికిన మణిపూస. ఈ పదాన్ని చమత్కారాస్పదంగా మలచుకున్న తొలి ఆధునిక కవి ఆరుద్ర. ఆతర్వాత ఈ ఛందంలో అనేక ముక్తకాలు వెలువడ్డాయి. నాలుగు చిన్నపాదాలతో పరుగులుతీసే ఈ పదం ఖండగతిలో సాగుతుంది. మొదటి మూడు పంక్తుల్లో పది పది మాత్రలు. చివరి పంక్తిలో తొమ్మిది మాత్రలు (5+4). ఇదీ దీనిపైనం.

చిరంజీవి చెన్నప్ప రచించిన ఈ 'మల్లిపదాలు' కూనలమ్మ పదాల కుదుట పుట్టినవే.

కొన్ని పదాల్లో ఈ రచయిత కొత్తగా చెప్పాలని ప్రయత్నించాడు. వేపాకు వైద్యాలకూ, వేమన్న పద్యాలకూ శ్రుతికలిపాడు. బాగుంది. వేమన్న పద్యం అప్పుడప్పుడు వేములా చేదుగా తోస్తుంది. కానీ పర్యవసానం ఆరోగ్యవర్ధనం.

సరదాగా చెప్పే అభిప్రాయాలతోపాటు చెన్నప్ప సామ్యవాద భావాలను కూడా ప్రకటించాడు.

'వాయువందరిసొత్తు
వారి అందరిసొత్తు'—

ఇదే నిజమైతే "కలిమి అందరిసొత్తు కాదేల మల్లి" అని ప్రశ్నించాడు.

ఈ సంపుటిలోని మల్లి శృంగార నాయిక కాదు. కవి వెళ్ళబోసుకునే భావాలను వినే శ్రోత.

ఈ పదాలను విశ్వనర్మబుల కీ శే గుండేరావు హర్కారే గారికి అంకితమివ్వడం గురుణ విమోచనానికి పునాది వేయడం లాంటిది. చెన్నప్ప ఇంకా పసవున్న రచనలు చేయాలని ఆకాంక్షిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

Dr. K. GOPALAKRISHNA RAO
Head, Department of Teluug
Post Graduate College
Osmania University Hyd.

# ఆమోదం

మల్లిపదాలు వినగానే కూనలమ్మ పదాలు స్ఫురించటం సహజం. వసుచరిత్రకు పిల్లవసుచరిత్రలవతరించినట్లు పదాలు వస్తున్నవి. ఈ పరంపరలోనివే మల్లిపదాలు. హైదరాబాదు సాయంకళాశాలలో ఎం.ఏ. చదువుతున్న మా విద్యార్థి శ్రీ చెన్నప్ప రచన ఇది. గోరంతదీపం కొండంత వెలుగు అన్నట్లు విద్యార్థి దశలోనే అపారమైన అనుభవాన్ని పొంది వానికి అక్షరరూపం సంతరించినాడు. ఇది నూటఇరవై ముక్తకాల సంపుటి. సంఖ్యానియతి ఉన్నందువల్ల దీనిని పదాల రూపంలో ఉన్న శతకం అనడానికి ఏమీ సందేహంలేదు. మల్లిని మకుటప్రాయంగా గ్రహించవచ్చు. రాజును, ఇష్టదైవాన్ని, ప్రేయసిని, ఊహాలోకంలో చిత్రించుకొన్న నాయికను ఉద్దేశించి ఆత్మానుభూతిని వ్యక్తీకరించడం పరిపాటి. చెన్నప్ప కూడ మల్లిని ఆత్మావిష్కారానికి భూమికగా అలంబనంగా స్వీకరించడం సముచితంగా ఉన్నది. మల్లి ఎవరో మనకంటే ఆయనకే బాగాతెలుసు. కనుక ఆమెనుగూర్చి తర్జన భర్జనచేయటం మంచిది కాదు. ఆమెనుద్దేశించిన పదాలతోనే మనకు ప్రసక్తి.

ఇవి పదాలంటే పదాలుకావు. అలతి అలతి పదాలలో అంతరంగాన్ని రంగరించిన పదాలివి. సూటిగా ఎదలోనాటే సూక్తులివి. పదాలతో గారడీచేసి, భావాలతో కుస్తీపట్టి చదివేవారిని తికమక పెట్టక సహృదయులంటే ఎంతో సానుభూతిని దర్శింపజేసినాడు చెన్నప్ప. ఈ పదాలలో శబ్దచమత్కారంతోపాటు భావౌన్నత్యం కూడ ఉన్నది. శబ్దార్థా

లకు గల అవినాభావ సంబంధాన్ని ప్రాచీనులతోపాటు ఈ కవి చక్కగా గుర్తించాడు. ఒక సందర్భంలో చెన్నప్ప అన్నాడు

ఫ్యాను తిరుగుచునుండు
ఫైలు కదలుచునుండు. అని.

ఒకవైపు ఫ్యాను తనపనితాను చేస్తున్నా, గుమాస్తా ఫైలును కదలిస్తున్నా అతని దృష్టి అంతా ప్రస్తుతారీఖుపైననే కేంద్రీకృతమైంది అని ఈ పదంలోని భావము. మొదటి రెండు పాదాలకు పరస్పర సంబంధం చక్కగా కూర్చినాడు చెన్నప్ప. గాలి కదలికకు కాగితాలు రెపరెపలాడటం సహజం. చల్లని వాతావరణంలో ఆఫీసుపనిచేస్తున్న గుమాస్తా చిత్తవృత్తిని సహజ రమణీయంగా చిత్రించినాడు.

ఫేషను, రేషను, నేషను, పోజులు, ఫీజులు వంటి అన్యదేశ్యాలు ప్రాసలను చక్కగా అలంకరించినవి. సూక్తిప్రాయములైన సత్యాలు ఈ పదాలలో తొంగిచూస్తున్నవి

మనసు మెచ్చని పిల్ల
మమత కూర్చుట కల్ల

అని అమూల్యమైన సత్యాన్ని చాటినాడు చెన్నప్ప.

నగర వీధుల్లో సంచరిస్తుంటే గోడలపై బోర్డులపై ఎన్నోవిధాలైన ప్రకటనలు ప్రత్యక్షమౌతుంటవి. వానిలో 'ఫామిలీ ప్లానింగ్'వారి ప్రకటనలు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. ఆ ప్రకటనలకు గుణపాఠం చెప్పి అందాలు దిద్దేవిధంగా ఉన్నది చెన్నప్ప వ్రాసిన పదం.

ఒకరిద్దరేముద్దు
ఇకపైనమరివద్దు

ఇదీ అదీ అవి అనటం ఎందుకు! తనకుతోచిన ప్రతి అంశంమీద పదాలువ్రాసి సహృదయులను మెప్పించినాడు చెన్నప్ప. ఈ అనుభ

వంతో ఇటువంటి పదాలను సహస్రాధిక సంఖ్యలో వెలువరించగలదని మనం ఆశింపవచ్చు.

హైదరాబాదు సాయంకళాశాల నామరూపాల్లో చాలామార్పుల నొందింది. ఈ సంవత్సరం నుంచి అది పోస్టుగ్రాడ్యుయేటు కళాశాలగా అవతరించింది. అధ్యయన సమయం కూడ పొద్దుటికి మారింది. సాయంకళాశాలలో ఎం.ఏ. చదివినవారు నాలుగు జట్టులవారు. ఒక్కొక్క జట్టులో ఒకరిద్దరిని ప్రతీకగా ఉంచుకొని సులభంగా గుర్తించటం మాకు అలవాటైంది. ఆ విధంగాచూస్తే సాయం సమయంలో ఎం.ఏ చదివిన చివరజట్టు చెన్నప్పగారి జట్టు. మున్ముందు ఎప్పుడైనా చివరి జట్టును గుర్తించవలసివస్తే చెన్నప్పను, ఆయనతోపాటు మల్లి పదాలను గుర్తించటం సులభం.

చివరికి ఒకమాట. పూజ్యులు గుండేరావు హర్కారే గారు మాకు గురుతుల్యులు–సంస్కృత విద్వాంసులు–తర్క–వ్యాకరణాది శాస్త్రాలలో నిష్ణాతులు. వయోవృద్ధులైన విద్వాంసులు గుండేరావుగారు యువకుల నాదరించి వారిని ప్రాణతుల్యంగా చూచేవారు. వారి అనుగ్రహానికి నోచుకున్న యువకులలో చెన్నప్పగారొకరు. గుండేరావు పండితులు ఇటీవలనే కీర్తిశేషులైనారు. వారి స్మృతిచిహ్నంగా చెన్నప్పగారు ఈ కృతిని అంకితమీయటం హర్షదాయకం. చెన్నప్పగారినీసందర్భంలో హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

అంకితం

శ్రీ॥ శే॥ పూజ్యులు గుండేరావు హర్కారే గారికి

నమస్కృతులతో.

# మల్లి పదాలు

వగరు చిగురులు మేసి
వలపురాగము తీసి
ప్రజల తత్వము తెలిసి
పాడవే మల్లీ ! 1.

ఆకులో ఆకువై
పూవులో పూవువై
వలపించు చిలకవై
పలికవే మల్లీ 2.

సుధలొల్కు అధరమ్ము
సుకుమార వదనమ్ము.
నాకు నీ సదనమ్ము
నాకమే మల్లీ 3.

మాయమాటలు గీటి
మానవత్వము చాటి
విశ్వ వీణను మీటి
పాడవే మల్లీ 4.

తీయ తీయగ పలుకు
తీయ తేనియ లొలుకు
చిరునవ్వులను చిలుకు
చిగురాకు మల్లీ 5.

మనసులోనా వెలసి
మాటలందూ కలసి
చేతలందూ సొలసి
చెన్నారు మల్లీ 6.

వీణవై మ్రోగాలి
రాగమై సాగాలి
రాగాబ్ధినే తేలి
పోవాలి మల్లీ 7.

మల్లి పదములు విన్న
మళ్లి విన వలెనన్న
తలపు పుట్టును మిన్న
ధరలోన మల్లీ 8.

విఘ్నమ్ములను నెట్టి
విజయమ్ములను పట్టి
ఇచ్చు పార్వతి పట్టి
కెఱుగుదును మల్లీ 9.

కవనమే జీవనము
కవనమే భావనము
కవనమే పావనము
కవికెపుడు మల్లీ 10.

మధురాతి మధురమ్ము
మహనీయ చరితమ్ము
వాల్మీకి కావ్యమ్ము
వసుధలో మల్లీ 11.

నన్నయాదుల నెంచి
నవకవుల తిలకించి
నవ్య పథమును గాంచి
నడతునే మల్లీ 12.

కవిలోకమున మిన్న
కవిత చూసిన వెన్న
తెలుగన్న పోతన్న
తెలుసుకో మల్లీ 13.

వేపాకు వైద్యాలు
వేమన్న పద్యాలు
తెలుగులో హృద్యాలు
తెలుసుకో మల్లీ 14.

తిక్కన్న శబ్దంబు
వేమన్న భావంబు
గురజాడ మార్గంబు
గుర్తించు మల్లీ 15.

ఎవరికో తలయొగ్గి
బెదిరింపులకు తగ్గి
అభ్యుదయ కవి మ్రగ్గి
బ్రతకదే మల్లీ 16.

పూలున్న చెట్టంటె
పూబోడి మాటంటె
మనసీని మనిషంటె
మరిజెప్పు మల్లీ 17.

ఉల్లిపొర జాకెట్టు
ఉప్పరం మొలకట్టు
నాతి ఒక రాకెట్టు
నగరాన మల్లీ 18.

పేరునకు 'సిస్టర్లు'
ప్రేమలకు మాస్టర్లు
నడకలో స్కూటర్లు
నగరాన మల్లీ 19.

కాంతలంటే ప్రేమ
కాసులంటే ప్రేమ
రేసులంటే ప్రేమ
రేగునట మల్లీ 20.

ఇంతిమోమున సిగ్గు
ఇంటి వెలుపలి ముగ్గు
పరిసరాలకె నిగ్గు
బంగారు మల్లీ 21.

ఆఫీసులో జోరు
చూపించు శ్రీవారు
ముదిత ముందర నోరు
మెదుపరే మల్లీ 22.

ఇల్లు కట్టిన వాని
కిల్లొక్కటే కాని
అద్దె ఇచ్చేడి వాని
వన్నింండ్లు మల్లీ 23.

దీపముండగ ఇల్లు
దిద్దుకొనుమే చెల్లు
బొందియుండగ ఇల్లు
పొందవే మల్లీ 24.

ఇచ్చుటయె ఒక తప్పు
ఇచ్చి అడిగిన ముప్పు
చెలిమి కలిమియు దప్పు
చిగురాకు మల్లీ 25.

అధికార దాహమ్ము
అర్థంపు మోహమ్ము
మీమీది స్నేహమ్ము
మించెనే మల్లీ 26.

చూడ వచ్చిన వారు
చుట్టాలు కాబోరు
పంతుటాకుల జోరు
ఎండుటకె మల్లీ 27.

మంచి నెంచెడి మాట
మరుగైన ఆచోట
నిలువ దగ దొక పూట
నిక్కమ్ము మల్లీ 28.

ఉచితంపు సాహాయ
మొనరించుటే రాయ
బంధువుల కప్పీయ
వలదెపుడు మల్లీ 29.

చెలిమి పెరుగగ జేయు
కలిమి పెరుగగ జేయు
ఊటలై పారేటి
మాటలే మల్లీ 30.

కలిమి వోయిన వచ్చు
బలము వోయిన వచ్చు
చెలిమి వోయిన రాదు
చిగురాకు మల్లీ 31.

పట్నాల కేగాలి
బస్సులో సాగాలి
ఉయ్యాల లూగాలి
వయ్యారి మల్లీ 32

ఆగినా ఒక గంట
ఆపైన ఒక తంట
బస్సు డ్రైవరు కంట
పడలేము మల్లీ 33

పనికి వచ్చిన చదువు
మనసు నచ్చిన వధువు
వసుధ సుఖముల కిరవు
వయ్యారి మల్లీ 34

ఎదిగి యున్నది బిడ్డ
ఎవరి కాళుల బడ్డ
కఠినులడిగిరి దొడ్డ
కట్నమే మల్లీ 35

బొట్టులో ఏముంది ?
కట్టులో ఏముంది ?
బెట్టులోనే ఉంది
గుట్టంత మల్లీ 36

సీటుకోసమ్మొకడు
ఓటి కోసమ్మొకడు
కూటి కోసమ్మొకడు
కుమిలిరే మల్లీ 37

కవుల కావ్యములందు
కనిపించు శశికందు
నిలజనావళి పొందు
తొలగించె మల్లీ 38

కలమాడినా ఏమి ?
కత్తి ఆడిన నేమి ?
కణ్ణు ఆడిన నాడె
బ్రతుకునవి మల్లీ 39

చాలి చాలని మెతుకు
సౌఖ్యమెరుగని బ్రతుకు
దినదినమ్మును చితుకు
దీనుండు మల్లీ 40

ఎండనక వాననక
ఇంత ఫలితమ్మనక
కష్టించె రేయనక
కర్షకుడు మల్లీ 41

మాతృ మూర్తిని మరచి
మాతృ భాషను మరచి
మాతృ భూమిని మరచి
మనలేను మల్లీ 42

చదువు చెప్పే గురువు
సంఘాని కాదరువు
జ్ఞాన తరువున కెరువు
సరసంపు మల్లీ 43

బ్రతుక నేర్చినవాడు
బ్రతుకు దిద్దినవాడు
బడిపంతులను వాడు
బంగారు మల్లి 44

గుడిలోన పూజారి
బడిలోన ఆచారి
బ్రతుకులో [1]లాచారి
అయ్యయో మల్లీ 45

కొట్టులో న్యాయమ్ము
కోరుటన్యాయమ్ము
తిరుగుటకె జన్మమ్ము
సరిపోవు మల్లి 46

కోట్ల ధనమును పోసి
కోర్టులను కైసేసి
కొట్లాటలను రోసి
కూర్చోరె మల్లీ ? 47

[1]లాచారి : నిస్సహాయుడు

చెప్పినా వినలేదు
చిత్తమున గనలేదు
మోదమున మనలేదు
మూర్ఖుండు మల్లి 48

చెరిపినా మాయనిది
చిరకాల ముంతునది
సృష్టిలో తీయనిది
స్నేహమే మల్లి 49

ఐకమత్యమె బలము
ఆత్మతృప్తియె సుఖము
సత్యచింతన జయము
సరసంపు మల్లి 50

రసభావ లోకమ్ము
రమ్యార్థ స్ఫురణమ్ము
హృదయైక వేద్యమ్ము
కవనమ్ము మల్లి 51

ఉదయాన అరసాలు
మధ్యాహ్న విరసాలు
మలిసంజ సరసాలు
మనకొద్దు మల్లీ 52

పదిమందిలో మెచ్చు
బాస చేయగవచ్చు
నిల్పుకొంటే హెచ్చు
నీకీర్తి మల్లీ 53

నాయకులు తామనగ
నవకవులు తామనగ
సన్మాన సభలనగ
సచ్చిరే మల్లీ 54

పార్టీ ఫిరాయింపు
పార్టీల పొగ సొంపు
పొరుగింటి తాలింపు
పొగడాలె మల్లీ 55

ఆదర్శములు జాస్తి
ఆచరించుట నాస్తి
కావలసినది ఆస్తి
కనుగొనవె మల్లీ 56



ఆశయాలే మ్రింగి
ఆవేదనల క్రుంగి
అసమర్థు డెబ్భంగి
అధికుడౌ మల్లీ ? 57

పనికి మాలినవాడు
పరుల నోర్వనివాడు
ఆరంభ హీనుండు
అవనిలో మల్లీ 58

మంచివాడే గాక
మరణించియుంగాక
జనులచే స్తుతిరేఖ
గొనలేడు మల్లీ ! 59

ఆలోచనలు పెరిగి
అనుమానములు తరిగి
ఆత్మతత్వము నెరిగి
అలరవలె మల్లీ 60

మారునది ఒక కొంత
జారునది ఒక కొంత
గత జీవితంబంత
కలకాదు మల్లీ 61

అచ్చ నుడికారమ్ము
మెచ్చనౌ సారమ్ము
పట్టిచ్చు కోశమ్ము
పల్లెయే మల్లీ 62

పసలేని ఏ పాట
పాడబడదే నోట
తేనె పల్కుల తేట
తెనుగేను మల్లీ 63

కప్పి చెప్పేవాడు
విప్పి చెప్పేవాడు
కవి పండితులు నాడు
నేడైన మల్లీ 64

విలువైన అందాలు
విడరాని బంధాలు
జానపద గీతాలు
సమకూర్చు మల్లీ 65

తప్పు చేసినవాడు
దండనకు గురికాడు
దొరికిపోయిన వాడు
దొంగౌను మల్లీ 66

ఆడిచూసిన ఆట
అనుభవజ్ఞుల మాట
దారిబత్తెపు మూట
తలపవే మల్లీ 67

అవసరానికి రాని
ఆచారములు పూని
కౌశికుండౌగాని
కచుడౌనె మల్లీ 68

లోకమది సత్యమ్ము
నాకమది స్వప్నమ్ము
జ్ఞానమిది నిత్యమ్ము
సరసంపు మల్లీ 69

వంటబట్టని చదువు
ఇంటి వారికి బరువు
మంత్రి పదవికి నిలువు
వయ్యారి మల్లీ 70

కరుణ ఎరుగని గుండె
కంటె మెత్తన గుండె
అందుకని దేవుండె
అందుండు మల్లీ 71

ధనికుంతు భూస్వామి
ధనహీను డాసామి
ఏడుకొండల సామి
ఎవడౌను మల్లీ 72

పేరుకే స్వతాలు
చోరులకె క్షేత్రాలు
నవధర్మ సూత్రాలు
నమ్మవే మల్లీ 73

ఇల్లు గుల్లా చేసి
ఇంటి వారిని రోసి
కపటంపు సన్యాసి
కానేల మల్లీ 74

ముఖము చూస్తే ముద్దు
రకము చూస్తే మొద్దు
వాని స్నేహము వద్దు
ఓ మంచి మల్లీ 75

ఆశయాలే మిన్న
ఆచరణలు సున్న
నాయకుల మాటన్న
నమ్మకే మల్లీ 76

కాగితపు వెలపెరిగె
కవిత విలువా తరిగె
మనిషి ఎదిగియు తరిగె
మానవత మల్లీ 77

ఫ్యాను తిరుగుచునుండు
ఫైలు కదలుచునుండు
మెదడులోన [1]నొకండు
కదలాడు మల్లీ 78

మనిషి చూస్తే సొంపు
మాట చూస్తే ఇంపు
మనసు చూస్తే కంపు
నా మంచి మల్లీ 79

---

1. మొదటి తేది

మైలతీయని సబ్బు
మంది మెచ్చని డబ్బు
కురియజాలని మబ్బు
కానేల మల్లీ ? 80

ఇంట పిల్లల బాధ
బయట అప్పుల బాధ
మధ్య తరగతి బాధ
మరియింతె మల్లీ 81

పండులో రసముండు
పడుచులో సొగసుండు
పైసతో జగముండు
బంగారు మల్లీ 82

భేదమ్ము కల్పించి
వాదమ్ము కల్గించి
వంచకుడు తాపొంచి
చూచునే మల్లీ 83

పైకి ఇంటర్వ్యూలు
బహు సంఖ్యలో క్యూలు
లోలోన వంచనలు
పని చేయు మల్లీ 84

పలికితే ఒక తంట
పలుకకుంటే మంట
మిడిసిపడు పతికంట
పడవద్దె మల్లీ 85

వచ్చి పోయెను పైస
తెచ్చిపెట్టెను గోస
రాకున్న ఏయాస
లేకుండు మల్లీ 86

సినిమాలలో చూసి
ఒడలెల్ల కైసేసి
పగటి వేషము వేసి
బ్రతుకొద్దు మల్లీ 87

గుడిలోన దండాలు
బడిలోన దండాలు
అడుగడుగు దండాలు
ఆర్చునా మల్లీ 88

తన కులుకు తనకింపు
తన పలుకు కడుసొంపు
ఎదుటి వానికి కంపు
ఎరుగవే మల్లీ 89

భాషా వివాదమ్ము
పరమత ద్వేషమ్ము
మించినన్ దేశమ్ము
మిగులునా మల్లీ ? 90

పెరిగింది ఫేషనూ
తరిగింది రేషనూ
ఏమౌనొ నేషనూ
ఎవడెరుగు మల్లీ ?! 91

ఫోజులధికంబయ్యె
ఫీజుల ధికంబయ్యె
చదువు మృగ్యంబయ్యె
ఛాత్రులకు మల్లీ 92

ఎంకి పాటల సొగసు
ఎంత మందికి తెలుసు
హత్తుకొని నా మనసు
హాయి గొను మల్లీ 93

అప్పు ఆస్తీ కాదు
ఆలు రంభా కాదు
రాయి రత్నము కాదు
బంగారు మల్లీ 94

పంచె కట్టిన గాని
ప్యాంటు తొడిగినగాని
భావదాస్యము పోని
బ్రతకాలి మల్లీ 95

మిన్నకుండిన చవట
మించి పలికిన ఝూట
ఏనాటికే బాట
తెలియాలి మల్లీ 96

ఉల్లి ఊరిన గాని
మల్లె విరిసినగాని
మంచి నేలాలోనె
మామంచి మల్లీ 97

చిలిపితనమూలేక
సింగారమూలేక
ముద్దుముచ్చటలేక
ముదమెట్లు మల్లీ? 98

మనసు మెచ్చనిపిల్ల
మమత కూర్చనితల్లి
తానునచ్చనితెల్లి
దండగే మల్లీ 99

ఎన్నికలలో గనుచు
ఎన్నికలలో నిలుచు
ఎట్టెట్టులో గెలుచు
నాయకుడు మల్లీ 108

ప్రజలెల్ల సుఖియించు
ప్రభుతనే స్థాపించు
నాయకుండరుదెంచు
నాయేమి మల్లీ 109

కష్ట సంపాదనము
ఇష్టమగు భోజనము
పుష్టికగు కారణము
పుడమిలో మల్లీ 110

సౌఖ్యమే స్వర్గమ్ము
దుఃఖమే నరకమ్ము
ఎవరెవరి భాగ్యమ్ము
వారిదే మల్లీ 111

రక్షకులగు వారె
భక్షకులైనారె
పనికిమాలిన వారె
పాలకుల్ ? మల్లీ 112

సందేహముల తోడ
సాగిపోయెడి ఓడ
అలల తాకిడి కేడ
నిలుచునే మల్లీ 113

రాజకీయంబాట
మృగ తృష్ణలో వేట
బేసెన నీ బాట
చూసుకో మల్లీ 114

వియ్యమైనను గాని
కయ్యమైనను గాని
సాటివారికె గాని
సరసంపు మల్లీ 115

రామచంద్రుడు పుట్టె
రావణుని పడగొట్టె
ధర్మమ్మునకు కట్టె
పట్టమ్ము మల్లీ

వాయువందరి సొత్తు
వారి యందరి సొత్తు,
కలిమి యందరి సొత్తు
కాదేల మల్లీ ? 117

స్వార్థమే నరకమ్మ
సంతృప్తి నాకమ్మ
దాస్యమే దుఃఖమ్మ
ధాత్రిలో మల్లీ 118

సామ్యవాదము వచ్చు
స్వార్థ భావము చొచ్చు
సర్వజనులకు హెచ్చు
సౌఖ్యముల్ మల్లీ 119

తెలుగు జాతికి జయము
తెలుగు తల్లికి యశము
వసుధకెల్లను శుభము
వయ్యారి మల్లీ 120